# గిరికుమారుని ప్రేమగీతాలు



విశ్వనాథ సత్యనారాయణ

# గిరికుమారుని ప్రేమ గీతాలు

రచన:

(1920 — 1928)

విశ్వనాథ సత్యనారాయణ

V. S. N. & SONS,
Marutinager, VIJAYAWADA-2.

అస్మదీయకంఠమునయం దాడుచుండె
నొక యెదోగీతి బయటికి నుబికిరాను
చొచ్చుకొని లోనికిం బోదు వ్రచ్చిపోయె
నాహృదయ మీమహాప్రయత్నమ్మునందు.

విఫలితపునఃపునఃకృతవివిధయత్న
భావితప్రచండబాఘాతధావిదారి
తాస్మదీయహృదంతరంబందుఁ దోఁచె
స్ఫురితసంఫుల్లనవజపాశోణసంధ్య.

ఈమహాసంధ్యలోఁ శాఁగదామయూరి
రమ్యకింకిణికిణికిణిరభసపాద
మంజులవిలాసనృత్యసామ్రాజ్యలక్ష్మి
యగుచుఁ గచ్ఛపీమృదుగీతు లనుసరించు.

## ౨

ఈమనోహరవీణ వాయించలేక
చేతకున నెంతు నే నశిక్షితుఁడ నంచు
నాలతాంగివిలోలనేత్రాంచలమునఁ
గదలుచున్నది దానిరాగాల మెరుపు.

ఈవిపంచికమీఁద వాయించుకోర్కి
ఎంత యున్నదో నైష్ఫల్య మంతవఱకు
తెరుచుకొనివచ్చె నాహృదంతర మదేలొ
గాఢనిద్రారతుని నన్ను గలతపెట్టు.

అసలు మ్రోగునో మ్రోగదో ఆవిపంచి
ఏల మ్రోగదు నాదురదృష్ట మనుచు

## 3

ఈజనసమూహమునయందు నే శరీర
మాత్రముగఁ బోవుచుంటి నామానసంబు
నమితతృష్ణాలసం బంతకంత భూమి
మీఁదినుండి స్వర్గానికి మెట్లు కట్టు.

ఏదో నన్ను వెంటాడెడు నెందుకొరకొ
అగునొ జన్మాంతరమ్ములయందుఁ జేసి
నట్టి సంస్కారలేశము ప్రాణములకు
వేచుకొనియున్న యాశయేమొ చివరకు.

౮

నిలుకడ నెఱుంగని వనాంతనిర్ఝరంబు
నీతి నా భావ మీశిలాదృతపథంబు
ననుసరించెదు జలజల మనుచుఁ బొంగి
ఒక్క బొట్టైన మిగులదేమో చివరకు.

ఈనిశీథిని నాచిత్త మెంతదూర
మరిగియున్నది తారక లద్దునఱకు
నవతి లే మున్న దని ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్ను జూచి.

౬

ఈమరందసమ్మిలన మః దేల యచ్చొ
మైన విసమును తెమ్మ యీమానిసి యది
క్రోలఁగలఁడు సుమీ కాలకూటవహ్ని
కలిత మఁటవె రత్నాకరగర్భసీను.

ఈభవస్రోతఃపథలజ్జారుణేక్షణముల
మొగము నాయది కనవచ్చొ ముక్తసంగుఁ
డైనవానిఁబలె నప్రయత్నుఁ డైతి
నైహికాముష్మికముల మధ్యమ్మునందు.

అరుణాస్రుపదాభనిష్కృపాపాంగకిరణ
శమశరశతఘాతవిచ్ఛిన్నహృదయశకల
ములను గూఢమనఃపాత్రమున నమర్చి
పశ్చిమాశాముఖుండనై పయన మైతి.

2

ఈలలితసృష్టి యేమొ యీపాలకడలి
యందుఁ గెరటాలు లేవంట యింక నెంత
వఱకు జేసిన హృదయాంబువలకె గాని
పాలు పొంగవంటె యెంత జాలునకును.

ఈలలితసృష్టి యేమొ యీపాలకడలి
యందు జలజంతువులు లేవఁటైనఁగాని
పాలు తిండిగఁ బెరిగెడి ప్రాణులైన
నెనుగునో యేమి చిత్రమో యెవ్వఁ డెఱుఁగు.

ఈలలితసృష్టి యెట్టిదో యిందుమీఁదఁ
బాపసెల్లా పరచి నిద్రపట్టకున్నఁ
బట్టినట్టు నటించఁ బొల్పరచునటవె
ప్రథితయోగ్యంతనంగనేసు పద్మనాభు.

౮

మొదటిసారి నాయెడందలో ముల్లు నాటఁ
బడి సుమశ్శూలమునుబోలె బాధపెట్టె
దేహము భరించుటయ కష్టమై హృదంబు
రాశి బాడబవహ్ని పరాక్రమించె.

అపిమొద లనంతములుగ నిందు దిగఁ బడిన
శూలములు ముళ్ళవోలిక సుంత బాధ
పెట్టి యంతట శాంతించు వెనుక ముల్లు
కలఁకిడిన నంతగా బాధ కలుగఁబోదు.

ఇఁకఁ గొన్నాళ్ళవునయేని యింతమాత్ర
మైన బాధయుఁ గలుగనియట్లు తోఁచు
నప్పుడు నిశాతబాణము లయినఁగాని
యేపపుయిన యోగ్య మగు నేమొ పదునుపెట్ట.

౯

అప్పటికిఁ జిన్నవాఁడ ననంతమైన
యీహృదయశల్యబాధ నే నెఱుఁగ నసలు
మిసుకుచుంటి మధుసరిదంతికల లోనఁ
బారలుచుంటి మొయిళ్ళగుంపులకుఁ బైన.

ఆశిశిరత్రమ్మయగు నిప్పు డది తలంచ
నే శోకసంతతిఝూంమున నీదులాడు
చప్పుడొకపాట పాడితి నందులోని
యర్థ మిప్పటి నాస్థితి కతికిపోవు.

ఈనిశీథిని నాచిత్త మెంతదూర
మరిగియున్నది తారక లడ్డువఱకు
అవత లేమున్న దని ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్ను జూచి.

౧౦

ఇంతలోన వికాసమ్ము లింతలోన
మీలనమ్ము లీశ్రావణవేళఁ బ్రాగ్ది
శాగగనలంబినీరదచయముతోడ
నామనోవికాసనిమీలనములు వోలుచు.

నీరదపృథుపత్రమునఁ దపనీయరేఖ
వలె జలదగర్భవిద్యుత్ప్రభల్ గనుఁగొని
నేను స్మరియించుచుంటి వినీలమైన
ప్రణయినీనేత్రముల సితాపాంగరేఖ.

సాంధ్యనృత్యదీశ్వరమురజమ్ము వోలె
గర్భఘూర్ణితమంథరగర్జఁ బొలుచు
నీజలదమాల చూచి నాహృదయమందుఁ
బ్రణయమధురగీతమ్ములు బాహిరిల్లు.

౧౧

ఆతఁ డొకవీణ నిచ్చె నాకది సజీవ
మా విపంచికశ్రుతులందు నమృత మున్న
దని గ్రహించిన నాదేహ మమృతఖండ
మది నదించద నాదేహ మనసిధూళి.

నాపురాకృతపాప మేమో పలుకద
యీవిపంచిక నే నెంత యాత్రి పొంది
దానితంత్రులు మీటన దానిపైనఁ
బట్టలేనంత కోపము వచ్చి నాకు

శిథిల మైపోవనీ విపంచిక యటంచు
విసరివైచితి దానిఁ బృథ్వీతలాన
నపుడు తెలిసెను నాయాత్మయందు దాని
తీవ్రఘాతమ్ము వచ్చి ప్రతిధ్వనించె.

౧౨

ఈ కలన శరత్పూర్ణిమామృతశశాంక
లలితజ్యోత్స్నావితానమా కలన ఘోర
ఘనతరాంధకారాచ్ఛటాక్రాంతభూమి
అంతః సగ మింగు సగ ముంటి నవ్వ నేను.

ఈ శరత్పూర్ణిమాచంద్రికాసుధాము
కడలిలో నున్న నేను సాఫేనభగ్న
వివశాంచాలత్తాకృతి వ్రాసియుంటి
ఈ సగము నాకు నాకె కన్పించఁబోము.

ఉగ్రరాహుచంద్రార్ధబింబగ్రసనము
వోలె నున్నది నాస్థితి.

౧౩

స్నేహాపూరితమైన నా చిన్న ప్రమిద
లోన కాంతి యుప్పొంగి వెలుంగ కేగు
వత్తి యతిపుష్పితమైన పైడిప్రత్తి
అస్మదీయమహాభక్తి యపరిమితము.

ఈ ప్రదీపికా కాంతి దిగిభసమూహా
గండఫలకంబులం దలంకారచిత్ర
వల్లులై వెల్గు నని లోన భ్రమసిపోతి
నకటా! దీపిక మొదల నంటుకొనదాయె

అంటుకొనెనేని యీదీప మతిశయితర
సాతలోత్ఫుల్ల ఫణిఫణాచ్ఛవివినూత్న
ఘనచలద్రత్న మగుచు శిఖావితాన
కాంతిచయమున నూర్ధ్వలోకములు ముట్టు.

౧౪

అమృతమూర్తి ప్రియవదనాంచలమున
మందహాసోదయం బగుమాడ్కి నాకు
చిన్నిపూదోటలోఁ గూడఁ జివురులొత్తె
నీవసంతప్రభావమ్ము నేమి చెప్ప

ఈపువుందీవబోదెలో విచ్చి ముడుచు
కొని భుజగమనై నిదురవోఁ గోర్కి గలదు
ఓలి సొగసు నాప్రియురాలివోలె నిష?
సూనవనలత నాకు శుశ్రూష చేయు.

౧౭

ఇది మహాగీతిప్రవాహకమువు నాయాంతరీక
మునిగిపోయెను నాలుక పిడచకట్టు
నవ్యనాకాంక్షపత్రితోరణము లున్న
నీహృచ్చలివేంద్రంలో వచ్చి నిలచినాను.

ఒడ్డు లురలిన యమృత మోహమో! ఆరోగ్య
వి[illegible]గీతమ్ముపైఁ బ్రవాహించినావు
శుభపవిత్రరూప జీవవాహినియ యన్మ
నాఘటము కాలశిఖరభిన్న మగుదాక.

అట నదృశ్యమ్మయగు ప్రవాహమ్ముచోటఁ
బొలములై భావిసమయలాంగలము తగిలి
యాఘటవిభిన్నశకలము లేమిభావ
ములు కృషీవలుహృదయసంకులము లగునొ.

౧౬

ఈవిలాసాధిక జ్యోత్స్న మెండ నుండి
పవలు తొలిసంజ రేకలు పర్వినంత
మధురసీమంతినీచారుమందహాస
వాసనలు చిమ్ము వెన్నెలల్ గాసె బళిర.

చూచుచుండ విలాసపుచూపు లోపవెం
గన్నుగవచిట్టచివరి భాగములయందు
సాంధ్యశీతలమైన యీచల్లగాలి
ముద్దుటిల్లాలిసరోమ్మక్తి ముస్మరించు.

శశి విలాస మీవెన్నెలకాల్వలందుఁ
దేలియాడు తరంగవీధికల నడుమ
నాప్రణయభావరాజహంసీప్రయాణ
మమృతమాధుర్యపుంద్రోవ లంటి నడచు.

౧౭

చరమశీతలమగు దివాచ్ఛాయలందు
నీవడక కొంచెముగ స్పష్టమైనయదియ
ప్రణయసూనపరీమళవ్యాప్తదేహ
కృతకుతూహాలులము పులకితుల మేము.

గ్రుతదినాంతసంధ్యానటల్లోకనాథ
చరణజనితరావమ్ములు గిరులుకొన్న
నీయురములోనఁ గలసి ధ్వనించుచుండె
మాహాత్మ్యవంతరమ్ములు నీలమసృణమూర్తి.

ప్రణయినీనీలనీరజాభముల కనుల
కాటుకయుఁబోలె గగనమ్ము క్రమ్మియున్న
నీగొడుగునీడల నొదిగి నిలచినాము
శైత్యముగ్ధప్రభూ! నవాషాఢజలద !

౧౮

ఆజగద్గీతతేజో విరాజమాన
మైన నేత్రాంతరమ్ముల నరసి యరసి
కొన్ని జన్మంబులకు మున్న నన్ను నేన
చూచుకొంటిఁ దత్సంయోగశుద్ధశీలు.

ఆప్రణయదివ్యశయ్యపై నవధరించు
సంగనాథుఁడ నూహకు రాని సుఖము
లేమొ యని చూచుకొనఁ ద్రపామధురిమఁ
గలఁగి చూపు నైశ్చల్యంబు గలఁచివైచె.

౧౯

ఏ శోకసమీరణబాలుఁడ ఏప్రసవము
నాకు సమభాగినిగఁ గూర్చినాఁడ తాను
మాపరస్పరమ్మును స్పర్శమాత్రమునను
పులకితబ్రహ్మపథమునఁ బోవఁగలము.

ఈయనంతపథమ్మున నెంతదూర
మరుగుదుమొ మాకె తెలియనిదది, తలపు
నందఁగారాని కడల సంధ్యాసమయపు
టరుణరోచులలోన వాహ్యాళి మాకు.

ప్రాగుదితచంద్రబింబముపైనఁ దరక
కట్టినటులున్న క్రొత్తమేఘంపుతునుక
మమ్ము రమ్మనుచున్నది మాటిమాటి
కచ్చటికి మేము నేఁడు ప్రయాణమగుట.

౨౦

నేను పసివాఁడ నప్పుడు నిత్యబాల
లీలఁగొంటకు నొక్క-గులాబిపూలమొక్క-
నాకుఁ జూపించి యిది నీది నాయనా! య
టంచు నాయేఁకు పుడిపె మాయమ్మ నిద్ది.

అరియ మొద లాగులాబిమొక్క-న్న నాకు
నాది యనుభావ మేలనో నాటుకొనియె
నలదిగంతిసుందలి ననదంకురములఁ
బిలుచుకొనివచ్చి దానికి పీనఁ జేతు.

ఆమొలకగూడ పైనంచినాభివృద్ధి
పొంది యొకనాఁటిప్రొద్దునఁ బూవు పూచె
అందులోని తుషారమ్ము లమృతధునులఁ
టనియె మాయమ్మ తన కది యాయు నంట.

౨౨

అలసి యీనిర్ఝరతటంబునందు నేను
విశ్రమించితి వనదేవతాశ్రమమున
నామె యాతిథ్య మొసఁగి నా కమృతమైన
యీప్రసవ మిచ్చి నన్ను రక్షించు మనియె.

అది యనుభవింతునా వలదా యటన్న
సంశయకృశానుకీలల సమసిపోయి
దృఢవినిశ్చయచ్యుతుఁడ నాదివ్యసుమము
వాసనలు చూడనే చూడఁబడియె నసుము.

అది మొదల యీప్రసూన మంతింత వాడి
నత్తరై పోవుచున్నది వనరమ యరు
దెంచి పూవునుగూర్చి ప్రశ్నించునేని
యే మని వచింపవలయునో యెఱుఁగరాదు.

౨౩

ఇస్థానము పరిపూర్ణమై వేగిపోగ
చంద్రబింబమ్ములోనఁ జొచ్చి చనుచు నుండు
నొకవిపన్నలవిష్ఠరిజ్వాలాంబు
నిచయపూరమ్ములందు మున్గితిమి పోయి.

ఆద్యుకెవ్వి యొడుఁ బుట్టెనో యని నొచ్చటికిఁ
బోవ్రనో యని సంశయంబులు ఘటిల్లి
యిద్దరము నిరువంకల నేగినాము
ఎంత యేగినఁ జూడ గానిపించ లేదు.

పోవుచుండ నే నొకనీటిబొట్టు నయితి
ఆపయినఁ గొన్నినాళ్ళకు నంబుకణ మొ
కండు నను జూచి 'నదిమొదల్ కానిపించ
లే' దని వచించె నది పట్టలేదు నాకు.

౨౮

ఒకవిచిత్రమ్మయిన స్వప్నకథ నీకుఁ
జెప్పెదన అది ప్రళయనిశీథమంట
పొంగిపోయి సముద్రాలు భూమియెల్ల
బుసబుసని నుర్వులో మునిగిపోయెనంట.

నాల్గుదిబ్బలు మిగిలియున్నవఁట యందు
నల్వురము నీవు నేనును నాజనకుఁడు
నాసఖుఁ డొకండు నిలిచియున్నామఁట ప్రళ
యాతిభీకరమఁట గగనాంగణంబు.

ఇంతలోఁ జూడ మిగిలినా మీవు నేను
నిఖిలవర్ణాతిభీకరస్నిగ్ధములగు
ప్రళయమేఘకాంతులను గన్పడియు నీవు
కన్పడవు తుద కేన యొక్కఁడ మిగిలితి.

౨౫

అమృతనిభృతమ్ములైన నీయక్షులందు
నఖిలవిశ్వము సవుగ! నా కగపడునటు
ఈవిశాలమ్మయిన నీయాలోచ
నములలోనఁ బ్రతిఫలించె నాహృదయము.

ఈమహావిశ్వముఁ బ్రతిఫలింపఁజాలు
మన యనంతత్వాగర్భితమహాభావ
ధునికి జన్మస్థలంబు నాతనువు విడియు
నాజననిగర్భమున కల్పమై జనించె.

అస్మదాదికరేణుసహస్రములను
దనమహాగర్భమునయందుఁ దాల్చియున్న
ఆయమ యనంతమూర్తి నా కనవగతము

క్షపణీయపయోరాశి మథించినాను
ఆగ్ కవ్వంపుగిరి నున స్నిహపతిగను
తరచితరచి బలమ్ములెల్లఁ దరిఁగిపోయె
తరచి తరచి భుజమ్ములు విరిగిపోయె.

ఆపయోరాశిలోఁ ద్రిలోకాతిభీక
రముగ విషవహ్నిహాలాహలము సముద్భ
వించె నది యోర్పుకలిగి దేవిగళమ్ము
నందు నిలిపితి నేను జ్ఞానాకృతి నయి.

అది గళమ్మున నిలిపినయపుడె నీవు
నేను నొకటైతిమే పురంధ్రి! శశికళ
సాంద్రశిశిరముగ్ధసుధాంశసరివంతి
మనశిరస్సులఁ దాండవించెనె లతాంగి!

౨౭

ఏ నాకప్రవాహగామిని యీవి యీవి
మొదలు తుదలేని యీమహాంభోధియందు
నాకసముచ్ఛ్రితశైలతుంగోర్మిచలన
నీయుదారతీరమునకుఁ ద్రోయఁబడితి.

దివ్యజంబూనికుంజప్రతిహతరయము
లగు ఘనసీమతల్లీతరంగాశ్వసితము
లైన యీభూమిఖండములందు నీవు
నాకుఁ గన్పించితి సుధాసైకమూర్తి

మఱల వీడఁగఁబోయిన మనలఁ జూచి
శరధి శాంతతరంగమై స్వచ్ఛవార
శిఖరడిండీరసౌధసుస్థితిని జేర్చి
లాలనము చేసెఁ బొత్తుబాలలవిధాన.

౨౮

ఇచట నొక పెద్దయంబుధి యచట నొక్క
పెద్దయంబుధి యీమధ్యఁ బృధ్వీమార్గ
మది ద్వీపాగ్ర్యంబులందుఁ దారాధ్వనికష
శిఖరముగు వృక్షతతిచేత శీతలంబు.

ఆపథమ్మున నీవు నే నరుగుచుంటి
మప్సరీమానసాబ్జంబు లమృతమధుర
ముగ్ధనిర్గీతములచే ముఖరితములు
పక్ష మతిపుగన్యు మమ్యో నీపరమకరుణ.

ప్రాగ్దిశాయాతమృదుమందపవనధూత
మైన యీతరుపుష్పంబు లంజలి గొని
సాచినన్నస్మితాకృతి వేచియుండె
నమృతధుని యపాంనిధి మన యాగమనము.

౨౯

నే నొక ప్రసూనవనాలఁ బూనితిని జేత
నా ప్రీతిసుమంబునందు నే నవఘళింతు
గ్రథితములు నిండు వరుసగా జాలకములు
కోరకములు కుట్మలములు కుసుమములును.

మొదటి మొగ్గలు నీకృపాముగ్ధదృగ్గ
భస్తి నెరుఁగమి వికసించి పరిమళించ
నచటివి భవత్కృపాలోకనాశ చేత
నర్ధవికసితమ్ములు తుహినాంశువదన!

ఈ చివర గ్రుచ్చఁబడిన పూలెల్ల విరిసి
నీవదనచంద్రమండలనిసృతామృ
తాభిషేచనమునఁ జేసి యాశలందు
ధృతమధుస్రుతిఁ దేంట్ల కాతిథ్య మిచ్చు.

౩౦

ఈమహావకాశమ్మున నిచట నేను
అచట నీవును నిలచి మోహానదృగంత
మాలిక పరిసారమున నీమధ్య నున్న
సీమ పుష్పమయమ్ముగాఁ జేసినాము.

ఒకరి నొకరము కలసికొ నురికి యీప్ర
సూనపూర్ణావకాశమ్ములోనఁ జొరఁగ
నిస్వాంతమును బుష్పాకృతు లెనసి లుప్త
భిన్నరూపులమై విడంబించినాము.

తెలిమొగిలుఁగుంపులోని నిగ్గులవితాన
విరిసిన యచంద్రచంద్రికావిమలరోచు
లొలసి మనపైన నొక్కరి నొకరిలోన
నిపవనచంద్రికలు గ్రుచ్చి యొత్తుచుండె.

౨౧

తారాన్వితనభముల వదన చంద్రమునకు దాఁక
శిఖరములచాలులో సుధాసిక్తమయ్యె
నాశరీరమ్ము సిక్తమైనది భృశమ్ము
అస్మదారోహణావరోహణములందు.

అనంత వేగాన గిర్యుపత్యకము లెల్లఁ
గడచిపోవుచు శిఖర శేఖరములందు
శిశిరపవనమంజులస్పర్శచేత సొలసి
యమృతమూర్తిని దన్మయత్వము భజింతు.

ఇన్ని శిఖరంబులందున నేగి యేగి
యీమహాస్పర్శసుఖ మేలొ యెఱుఁగలేన
ఉన్నతోన్నత మీశిఖరోజ్జ్వలాగ్ర
సీమ శశిలోన నీవు తోఁచితివి నాకు.

౩౨

సూర్యుఁడను నేను ప్రాగ్దిశాసుందరీము
ఖారవిందసుందరతిలకాకృతి నయి
యుదయ మందితి నాకోస మెదురు చూచె
విడిలు రేకల నీప్రొద్దుపొడుపుపూవు.

ఓదయాస్తనగంబు స్వీయోజ్జ్వలితపి
శంగవర్ణ సుందరదళచ్ఛవులచేత
నా మెయును ముగ్ధశిశిరకరాలి నేను
ఒకరి నొక్కర మనుసరించుకొనినాము.

మాపరస్పరాలోకనమధురదీర్ఘ
రమ్యసుందరాపాంగసూత్రములచేత
ననిలపథములఁ దేజోమయమ్ములైన
ముళ్ళు పడెఁ బృథివ్యాకాశములకు నేఁడు.

33

ఈసుభార్ద్రశాఖావళి యేచు కలసి
కొన్న యీయెడ గుఱు తిడికొన్నఁగాని
ఆపయిన నేన ప్రవహింతు నధికమూర్తి
నామె యే మాయెనో తెలియంగరాను.

వేగ మూగి శాంతమ్ముగా నేగుచుండ
నేను శారదస్వచ్ఛవిజ్ఞానమూర్తి
నామె నాయట్టయడుగున నణఁగియుండఁ
బోలు చిక్కణశ్యామజంబాలమూర్తి.

జలనిధిప్రాంత మద్ది పార్శ్వములయందు
బంగరుంబచ్ఛకం కెలు వదలి సొగసు
చాలుకట్టిన యీరాజనాలపైరు
నందు నామె ముమ్మూర్తుల నవఘళించు.

౩౮

ఈనవవసంతసమయ మిల్లేగుదెంచి
చిఱుతపువ్వుఁదోఁటలెల్లలఁ దిరుగు ప్రణయ
ముగ్ధమూర్తిని మత్పదాంభోజములను
వికసితసుమాతిథేయ మర్పించెఁ జూడు.

యుగయుగాల వసంతపుటోఱపు లెల్ల
దాచికొని భావిమధుసౌందర్యచిహ్న
గర్భితమ్మైన యీసుమకాండము లివి
దివ్యయౌవనవతులట్లు తేజరిల్లు.

ఆతిథేయమ్ముగా లబ్ధమైన యీసు
మప్రకాండమ్ము సమకూర్చి మాలఁ గ్రుచ్చి
ఇది భవత్కంఠసీమ నర్పించినాను
నీవు ధ్రువమండలంబున నిలచినావు.

32

నీనిజస్వరూపమ్ము ధ్యానింప నెంచి
విశ్వవస్త్వంతరమ్ముల వెదకి వెదకి
కొసకు నాహృదయాంతఃకోటరస్థ
మైన సూక్ష్మాకృతిని గన్న నే నెఱిఁగితి.

నేను ప్రాపంచికముగ ననేకకార్య
లగ్నహృదయుండఁబోలె నెల్లరకుఁ గానఁ
బడుదునేకాని దేవి! నాభావ మెపుడు
నిత్యలగ్నంబు నీపాదనీరజముల.

౩౬

నీవియోగ మ్మటంచు నే నిక్కువముగ
నెఱుఁగనే నెఱుంగను నాదుహృదయసీమ
నీ వకృత్రిమభావనానిశ్చితాత్మ
నెల్లపుడు మూర్తి కట్టితివే యటంచు.

ఇది యెచటనుండి వచ్చిన దీవియోగ
వహ్ని యెచటి దీసంయోగభావశాంతి
దేవి! నీగీతములు పాడి దివ్యమైన
నీదుసంయోగసుఖవార్ధి నీదుచుంటి.

ఎపుడు నీపాట లే నాలపించలేనొ
రవులుకొనును నాదుహృదంతరమునయందు
నీవియోగాగ్ని యపుడు.

౩౨

ఈపవిత్రకార్తికసంధ్యాపవనముల
సోలయు జంతాతపములఁ గృశోపవాస
కార్శ్యమునఁ దూలిపోయి నాకాస్ఫు సాంధ్య
నృత్యాదీశ్వరు నివి తలపించు నెఱఁలు.

ఈపవిత్రసంధ్యాకాలనృతనవారు
గాంశువులు శశక్షతజరమ్యములు నాదు
మేనఁ జందనమునుబోలె మెత్తఁబడియోఁ
గనులు నాయవి నిప్పుకల్ గ్రక్కుఁదొడఁగె.

భవమహాపూజఁ దన్మయభావమంద
నాపయిన నీకటాక్షసంతానలహరి
ఇంతి! నీవు దోసిళ్ళతో నెత్తిపోయ
శివశిరఃప్రదేశకృతాభిషేక మయ్యె.

ఈయుషఃకాలశీతవాతోర్మి లేచి
కృష్ణవేణ్ణాసరిత్కుల్యఁ గృతనిమజ్జ
నాతిధౌతశరీరులమై శివార్చ
నోపవాసవ్రతం బూని యుండి మనము.

భుక్తపూర్వాహ్ణవేళకుఁ బోయి భక్తి
మోసులెత్తఁగ నాసంధ్యముగఁ బొనర్చి
నట్టి శైవమహాభిషేకావసాన
మునను గర్పూరహారతి పూనినాము.

ఆమహాఖండహారతియందు దీప్త
మైన యిలువేల్పు విశ్వేశ్వరాచ్ఛలింగ
మందుఁ బ్రతిఫలించిన మనయాకృతు లివి
అర్ధనారీశ్వరభ్రాంతి నావహించు.

పారిజాతమ్ములనిష్యందినీరజమ్ములతొ
నన్నెతమునల్లి నిండఁ జందన మలంది
మద్భుజాశ్లేషితాంకసంవలితమగు గ
ళమ్ము కాలాగురుకళంకితమ్ము చేసి.

కమ్రకస్తూరికాతిలకమ్ము దిద్ది
ఫాలసీమ, బంగరుచంద్రవంక పొదిపి
దీర్ఘ రమ్యసీమంతవీధికఁ గనులను
గృప విభూతిరేఖలను దీర్ఘీకరించి.

నీయెదుట నిల్చి నిన్ను ధ్యానించుచుండ
మార్గశీర్షపు భూధ్రపరిమాణమైన
మంచు మత్తనూవల్లికాంచలముల
మసలుచున్నదిసూవె సంబంధివోలె.

ఈనిభృతపవిత్రైకాదశీనిశాప్ర
శాంతశ్రీకాలనాథపూజాసమయము
లందు ముఖమండపమునందు నందజీవలె
నాప్రదీపము వెలిగించినాను నేను.

ఇవియుఁ జెంగల్వమొగ్గంగో శివకషాయ
పులకితజటాగ్రశేఖరమ్ములో ప్రదీపి
కలు శివాలయముఖగృహజ్వలితములయి
దివ్యతారక లన్న భ్రాంతి కలిపించు.

అస్మదీయప్రదీపిశాభ్యంతరమున
ప్రజ్వలితమైనయది పరబ్రహ్మదీప్తి
దేవి! తావకకరుణాప్రదీప్తివలన
నీసమాగతేతరజను లెఱుకలేక.

౪౧

నీవయినఁ బాడికట్టి నావిభృతగీతి
పాడుటయె పరమార్థ మాపైన దేవి
అందుఁ బ్రత్యుత్తరమ్ము నీమందహాస
బాలచంద్రాతపములలోఁ బ్రజ్వలించు.

బాలకులు మూఁగి వెన్నెలవత్తికొఱకు
శ్లక్ష్ణవృష్టులు వెదుకాడుచందమునను
ముగ్ధహృదయులు నామిత్రినులు మదీయ
గీతికార్థమ్ములకు వెదకెదరు దేవి!

# రతి

అల్పబుద్ధు లజ్ఞాతదివ్యాస్మదీయ
భావ లీకురదృష్టదేవతలు వచ్చి
ముగ్ధహృదయుండనైన నన్ మోసగించి
నాహృదయగీతి లాగుకొన్నారు దేవి!

విమలమృదుగీతివైఖరుల్ విస్మరించి
విస్మరించిన దిగులుంగో వేగురునయి
మత్పురాగీతికాంచలమార్గములను
దిరుగుచుంటి నున్మత్తునికరణి నేను.

భవదనంతభావములఁ ద్రిభాగశేష
మైన యీదీర్ఘహేమంతయామినులను
గలతనిద్దురలో స్వప్నకలనచేత
నిను సాక్షాత్కరించుచుంటివి లతాంగి.

పృథివి యంతయు నీపాదపీఠముగను
నలవరించి యనంతాకాశ మావరించి
అనిలవీచికా స్తంభన మాచరించు
నిన్ను సేవించుచుందు రగ్నివరుణులు.

౪౪

ఈగవాక్షంబునుండి నాపైఁ గవిసిన
పీయుషారేఖ లివియు మత్ప్రేయసీప్రి
భాతవేళాశిశిరముగపంకజాత
మృదుకరస్పర్ధవోలె నన్ మేలుకొల్పు.

మీలితాక్షుఁడనై సెజ్జ మెదలుచుండఁ
దెలివిపొలముల సొగసు ఎల్లలకుఁ దగిలి
నామనసు నేదో యొక్కయజ్ఞాతపూర్వ
మైన యనుభూతి కలిగె నాయంతరాత్మ.

అనిమేషార్ధమున భాసమయ్యె నాకు
గతవిభావరీసుఖదుఃఖఘటన లెల్ల
స్వాప్నికము లని సత్ప్రకాశమున నింకఁ
బోదు నని పులుగడిగిన ముత్తెమట్లు.

౪౭

ఈ ప్రణయగీతి చిత్రమే యేరితోడ
నైన నే నుండ నగ్గకేని రాను
నాకు నేకాంతమునయందు నన్ను మనుగఁ
జేసినది హావభావసుశ్రీలచేత.

ఆమధురగీతి నేను నేకాంతగోష్ఠి
నున్నయప్పుడు నీవు రా నొక్కయింత
కొంక వాగీతిసతి త్రపాకోమలాత్మ
అది మనము నర్మగోష్ఠి నున్నపుడు రాదు.

౪౬

అమృతతీర్థంబునం గ్రుంకులాడఁ బోయి
యీదనుక దేవి నీవు రాలేదుచూవె
నీకయి శశాంకమృదుయామినీపరీమ
ళానిలములలోఁ జూచుచున్నాను నేను.

రంజితాధరగతాంబూలరక్తిమంబు
చిఱునగవుతెల్లదనములోఁ జిటిలిపోవ
నెదురుగాఁ దోఁచి నాకు నందిచ్చినావు
చిన్నిశిశువునుబలె తీర్థసేవఫలము.

అరయ నందీశ్వరుని యీపదాంకురితవి
షాణయుగరమ్యమూర్ధదేశంబుపోలె
హైమజలదంబుకొసలఁ గోరాడుచుండి
చల్లనయ్యె మాయెడల నీచంద్రరేఖ.

౫౨

ఏడెనిమిదేండ్ల కూఁటటు తెమగరాని
కుఱ్ఱవోలిక భావముగ్ధుఁడను నేను
ఎప్పుడేని సముగ్ధుఁడనేని యితర
జనుల సంఘర్షణప్రతిచ్ఛాయ లవియు.

కాదయేని చేమంతి ఆఘ్రాణయోగ్య
పైన నిన్నుఁ జుంబింతునేలా! విలాస
మొలుకు నినుఁ జూచి యానంద మొందలేక
చెలువుఱెక్కల విడిలఁదీసెద ని దేల.

౪౮

నీ వసంతభావాలయవై విశాల
భావసామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీకృప న దెంత భావమేనియును సుపరి
చితమయట్టులఁ దోఁచు నాచిత్తవీధి.

ఈప్రణయభావగీతము లివియు నీకృ
పాతిశయమునఁ బూవులేనట్టిచోటఁ
దావియును క్రొమ్మొగిలులేని తావునందు
శైశిరపృషత్పరంపరల్ సంతరించు.

౪౯

శ్రీదమై శాంతమై సమీచీనమైన
యవ్యయపదంబునందు సింహాసనమున
నీ వధిష్ఠాత్రి వేలుచున్నావు కమల
పనవములు వీచు నీపదాబ్జములనుండి.

అకట! కామాంధులైన యీయారుపర్వ
తములు వచ్చినవే వచ్చుదారి కడ్డ
మిన్నిదినములుగాఁ బ్రయాణించుచుండి
యవ్యయపదంబు పొలిమేరలైనఁ గనక.

౫౦

ఇవి మహామోహప్రారంభము లిచటనుండి
వివిధకష్టంబులు ననుభవించినాఁడ
అచట ముక్తిఫలాలు నం దెచటఁ జూచి
నను సుఖాలె పరిమళించినవి భృశమ్ము

ఎంతయెంతకష్టమ్ములకేని యొగ్గి
ఎన్నిమోహాలనైన జయించినాఁడఁ
బూర్ణయత్నమ్ము చేసి యీముక్తిఫలము
గట్టుసైతమ్ము కొంచెము గనుకొంటి.

ఇరులు గ్రమ్మ నిప్రొద్దున మఱలఁ జూడ
గడుచుకొన్న ముక్తిఫలాలు వదలిపెట్టి
గెలుచుకొన్న మోహాల నేలలకు వంగి
అకట! సాలోచనాత్ముఁడ నైతి నిట్టు.

౫౧

అతివ! యీకుంప మీఁది నిత్యాగ్నిహోత్రి
నైన నాదుకర్మిష్ఠితకగు సహాయ
పడెద ఏపొఁగ పోయి నాపలితనేత్రి
కోణములు జ్యోతులై వెలుంగు గృహలక్ష్మి!

వచ్చిన వసంతమల్లికాప్రసవదామ
ములను మంచిగంధ మ్మంజలుల ఘటించి
ఆహుతిగఁ జేసితిన యిష్మహాగ్ని యందు.



కనుగొనినవారు నను వసంతుని సుమాస్త్ర
గుఱిచి యజ్ఞదీక్షితుఁ డనుకొనిరి గాని
గేస్తురాలవు నీవ యగ్ని సమకూర్ప
నగు నిజానికి కర్మిష్ఠి నని యెఱుఁగరు.

౫౨

పగలె రాతిరివలె తమోభయద మయ్యె
గగనభాగగర్జితమేఘఘటలవలనఁ
గురియుచున్న వర్ష మ్మొగి కురియుచుండె
నేగుచున్న నే నిట్టుల యేగుచుంటి.

పటపట నెగుల్చుకొని నేలపైకి దుమికె
నేను యామిన్ను లవోచ్చట నీశరీర
ముత్పులక మయ్యె నే నుఱ కూహ సేతు
పిడుగ దెల్లుండు నాపైనఁ బడునయేని.

ఆర్ద్రవసనాంతపిహితో త్తమాంగుఁడై స
యేను నభిసారికంబలె నేగుచుంటి
నాచను పరిశ స్త్రపథ మెచ్చటో

ఈవిలయ వాతవర్ష పాతావసరము
ప్రాగ్వకార్త్తాభిలాష్టమును సుదీర్ఘ
మైన మనజీవితంబునయందు సంది
యములు కలిగింపఁబడుచుండె నమృతమూర్తి.

ఈవిలయ వాతవర్ష పాతావసరము
నందు మనపురాకల్పితమైన ప్రణయ
సౌధ మట్టిట్టు కదలి భూస్థలిఁ బ్రపాత
ముగునో యనుసందియమ్ము నన్నావరించు.

ఇతఁడు విలయాధినేత కాడే శశాంక
వదాళి యీదేవదేవుదివ్యాలయమున
నాందిపీఠముకడ భావనాప్రకల్పి
తాస్మదుభయమూర్తి గ సమర్చాత్ముఁడైతి.

౫౪

ఈపయోధితరంగమ్ము లింతవఱకు
పరువులై వచ్చి యొడ్డున విరిగిపోవు
ఈయనంతనైల్యమ్ము తా నిచట నిచటు
తెల్లని కెరళ్ళలో వచ్చి తేలిపోవు.

ఈయనంతశూన్యమును నైల్యించె నెవఁడు
ఆమహానైల్యమును దిగంతావృతమయి
ముంచుకొను వార్ధిఁ బ్రతిఫలింపించె నెవఁడు
నన్ను నీవార్ధితటి నిల్పినాఁ డెవండు.

ఈయంతనైల్యమ్ము నాయాశలేన
మును వ్యాపించె నాజన్మమాది

౫౬

సుకవుల కాలమునందు వ్రాసికొని మొదలు
సృష్టిలో నాటికి వసంతము సుమనోజ్ఞ
మైనఁ గానిమ్ము నాకు నీ వన్న మేలు
జలదరించున ఓయి! ఆషాఢజలద!

నిను మదీయగిరాంవీధి నిలిపి శైవ
సాంధ్యతాండవనూపురస్వనము లోలుకఁ
జేసితిని నీవు మింటికి క్షితికి నేను
కవుల మైత్రిమి హృదయదుఃఖములు పాడ.

నీవు జగమునఁ జీకట్లు నిండఁజేయ
వెలుఁగు చొరని యింటిమూలలకుఁ బ్రాకి
ముసుఁగుముప్పటిలోఁ గన్ను మూఁతవెట్టి
పొదలు పెనుచీఁకటిని శాంతి వెదకికొందు.

౫౬

ఇది ప్రసవజన్మ మెత్తిన దిదియ చాలు
నన్ను నవహైమనిగళబంధములచేతఁ
దనయెడకు లాగికోఁ బల్లుత్రాళ్లఁ గూడ
నేటికో నన్ను బంధించ నింత తివురు.

ఇది యొకండె బంధ మసి మది నెంచికొంటిఁ
గాని యారెమ్మ యాకొమ్మ దీనిచివర
పొలుచు చివురులు పిందెలుపో యివెల్ల
నన్ను లాగఁజూచెడిని బంధములు వేసి.

నిక్కముగ ననతిక్రమణీయమైన
దైవమును నూర్ణనాభికృతమగు చెట్ల
వాగురఁ దగుల్కొని కృతమహాగసుఁడను
వెలికి లోనికిఁ గాక తపించుచుంటి.

౫౭

అసలు నడిసంద్రముందు గేహంబు కట్టి
యీతుపానుల గని భీతి యేల పొంద
ఒక్క వేళ యీవార్నిధి యుబికివచ్చి
నన్ను ముంచునే యని యనుకొన్న నేమి.

నాగృహము గుర్తుగానున్న నావికులకుఁ
దొలుతరోజుల మనసులోఁ గలఁకగాని
ఈమహావార్ధి కడియు తేఁదా మొదల గ
ణించుకో నొందు రెండు కన్నీటిబొట్లు.

ఇపుడు బిట్టుగ రేగెడు నీతుపాను
క్రమముగాఁ దగ్గిపోవును కాక యేమి
చేయఁగల దూరంకే పొంగి శిశిరమైన
కెరటములమీఁద నన్ను నూగించునేమి!

గిరికుమారుని

# శిల

ఎట్టయెక్కురుగఁ దోఁచెను కొట్టవచ్చి
నట్లు కోసిన కొండకొమ్మనఁగ నీవె
రత్నమయకించిదసితనీరదము వాయు
పథముకడఁ దాఁకి తారకాపథము మిగిలి.

కాన్గకొమ్మల గోనఁ జీఁకటులు ముదిరి
ముడులుపడి నేలపై రాలి పడినయట్లు
నీలచిక్కణములు చల్లనిడ లోలసె
మఱల నీట విశ్రమింపఁగ మనసు పుట్టు.

పొదవెలికి వచ్చినట్టి లో నిదురవోవు
శ్వాపదముకాలిగోరు నా వరలు మొయిలు
చాటుబడి యర్ధవిస్పష్టచంద్రరేఖ
నామెద సమాశ్రయించు పునారికంస.

ఈవిశాలము నందనోపేత సమ్మృత
దంబు సుఖనిధి స్వర్గఖండంబు దీని
మృదుహృదయమందు నేను నిర్మించుకొంటిఁ
గడు నదివ్యవస్తువుల సంఘటనపరచి.

ఈమయానిర్మితస్వర్గసీమయందు
నిఖిలవర్ణసుందరతరస్నిగ్ధమైన
హరిధనుఃఖండ ముదయించె నాథచుప్పు
చివరలుచు వానజల్లులచేతఁ గరగె.

నాస్వాదు తమక్షేత్రసంతతులు రాజ
నాలు పండెను తొలివిత్తనాలు పండె.

౬౦

మనసిచాహాని కచ్చువోసినదిసూవె
సకియ ముగ్ధవిస్రబ్ధ యీజన్నియావు
రియతభావుఁడనై యొడల్ నిమురఁబోవ
నాయొడలు నాల్కతుద చాచి నాకఁజొచ్చె.

తరచి గిలకొట్టరాదును దరకమీఁగ
డలును చిక్రుపలై వెన్నయు వెలలరాదు
సుప్రసన్ననిత్యము లామెచూపు లట్లు
వికృతిరహితమే తత్ప్రకల్పితపయస్సు.

ఉజ్ఝితాఘదివ్యమ్ములౌ నుభయసంధ్య
లను బరస్పరసేవావిలాసనేత్ర
లగు భవత్సితాపాంగపయఃప్రవాహ
వీచికాసుఖస్తిమితవిలోచనుఁడను.

కృత్తమహింసనితిప్రదోన్మత్తమస్త
విహితమై యష్టాష్టాభిపిహితమైన
లె శినబార్హ్యాపదమ్ములు మసృణమయ్యె
మనసొఁగు పూజాకుంకుమమ్మువలన.

ఒడ్డిగిలఁబెట్టి కొడితీసి యుజ్జ్వలింపఁ
జేసిన ప్రదీపికాకాంతిఁ జీఁకటులును
పలుపలై కపురారతివెలుఁగులోనఁ
బొదలె జ్యోతిస్సులన దేవిపదనఖములు.

ఈశరద్రాత్రి శైలకన్యాసుహాస
రంజితాత్మలము శివశిరస్సుమీఁద
సగము నిండిన చిన్నారిచందమామ
మొగిలుచాటున వెన్నెల మూసబోసె.

౬౨

౧

వానకోయిలనై నేఁ బిపాసఁ దగిలి
వృతవినీలాబ్దమున నొక్క ఱెక్క విచ్చి
ఎండ పలుచనిపొర నొక్క యొఱక చాచి
పైకిఁ జూచుచునుంటి నీరాక వేచి.

అతికృశీభూతమగు దేహయష్టితోడ
శారదాచ్ఛనీరదముక్త జలకణంబ
వైన నీ వేగుదెంచి న న్నంటినావు
లేమ ! నీ వంటినట్టులే లేదు నాకు.

శిశిరమధుమాసములు గతించి కృషికులు పొ
లాలు దున్నిన నాఁగేఁటిచాలులందు
ఱెక్కలను జాచుకొని నీటిచుక్కవైన
నీమృదుస్పర్శలో మేను నించుకొందు.

౬౩

ఈ చిఱుతముత్తెమును చూచి యెల్లవారు
ఏ మహాసాగరాంతరా నిది దొరకెను
ఏ మహాశుక్తిగర్భాన నిది జనించె
నని మహాశ్చర్యచేతస్కు లైరి దేవ!

శుక్తిగర్భమ్ము చేసిన సుకృత మేమొ
దివ్యరత్నపరీక్షకుల్ తేరి చూచి
ఇది మహాద్భుత మనిరి యేద్వీపమందు
చిఱుతముత్తెమ్ము లిట్టివి యెఱుఁగ మనిరి.

మౌక్తికాచ్ఛప్రభల్ చూచి మనుజు లెల్ల
స్వాతి తొలివానచినుకు కెంతస్వచ్ఛ మనిరి
కాని తచ్ఛుక్తిగర్భసంకల్ప మేమొ
ఎఱిఁగినది స్వాతిచినుకు కొక్కఁడే! శుభాంగి!

౬౪

అస్మదంతరసంభూతమైన కోప
మనెడు వహ్నిక విసరితి నామెమీఁద
ఆమెయును నోర్పుతోఁ గాలిసంత కాలి
ఎంత కటికతనమ్మని యుడిసిపోయె.

కడగి నామెద నిండి బంగారు ప్రేమ
పూర మాయమమూర్తిపై ధారపట్టి
గ్రుమ్మరించితి నామె నన్ గ్రుచ్చియెత్తి
నిహ్నవయ మెంత చిక్కణనిభృత మనియె.

ఒకమహాసంస్కృతిఫలంబు నొందు వేళఁ
దలఁతు నామె నాకాలిసంకెల యటంచు
ఒకమహాసంస్కృతిఫలంబు నొందు వేళ
మచ్చిగస్థపూజాకుసుమం బటంచు.

౬౮

కరములందునఁ గరములు కలిపి పైచి
ఇట్టి మా నిర్వ్యారము చెట్టు కట్టినాము
చిగురునఁ గొసాకులోఁ జిన్ని చిన్ని పూలు
కాయలును పిందెలును బూచి కాచినాము.

ఈ తరువునందుఁ జివురులు లేఁత లేఁత
పూపమొగ్గలు తావులు బుగులుకొన్న
పువ్వులుగ నన్నుఁ జేసి నీవు తరులగ్న
కంటకాకృతి వైతివి కరుణమూర్తి!

౬౬

నిరత మీకొండయంచుల దొరలివచ్చు
నతిస్రోతల వేగాన నెగురు సీమ
హాంబుశీకరసంతాన మాకసమునఁ
జిఱుతక్రొవ్వానజల్లుతుంపురులవోలె

తుంపురులజల్లులందుఁ ద్విషాంపతిఘృణు
లొలసి కిర్మీరితంబైన వ్యోమసీమ
నైంద్రకార్ముకఖండసహస్ర మొప్పి
చివుకు తొడగెను మింట మాఘవతలక్ష్మి.

నీటిజల్లుతుంపురుల పందరులలోన
ఇంద్రధనువుల తోరణా లెగురుచున్న
పెండ్లిపందిరి నన్ను భావించుకొనుచు
నాయొడలె నాకుఁ దెలియ దీనాఁటిపగలు.

౬౭

ప్రతిదినమ్మును సాయంసరాగరమ్య
జలధరచ్ఛాయలందున నిలచియుండి
అరియ మఱిమఱి యనిపించు నామెచేత
నేను నిన్ను ప్రేమించుచున్నా నటంచు.

మాపిఱుతకందుల హాసమ్ముఖోచితంపు
నెలపొడుపు రేఁత పలుచవెన్నెల చివుళ్ళ
లోన మాప్రేమ నిశ్చితంబైనయదియ
ఈవిధి దినమ్ము ననిపించు వేళ నేను.

ఆపలుకులోన నెప్పటిదో పురాను
భవ మొకండు మనఃపథిఁ బ్రాఁకులాడి
యిదిగదా న న్నిటుల ముక్తిపదముత్రోవ
వెలయఁజేసినదని యనిపించుచుండు.

నేను మాయమ్మయొడిలోన నింతవాఁడ
నై నయపుడు నాలోన నీయఖిల మిమిడి
యుండెఁ గావలె నేఁటి కి ట్లుబికివచ్చి
చిత్రవిచిత్రభావాకృతుల్ చెలువుమిగిలె.

పాడుటకు మున్ను కంఠగర్భమున నెలుఁగ
రాక యవ్యక్తమైయున్న రాగమట్లు
నిభృతచిక్కణామూర్తుఁలు నీవు నిసువు
లిన్ని సుఖములు దాగినా రెటుల దేవి!

అస్మదీయహృదబ్జనాళాంతరమున
బీజరూపమ్ముగా నుండి విశ్వ మింత
ఇది బహిర్గతమగుదాఁక యెఱుఁగలేన
అంత యవ్యక్తశిశుమూర్తి నైతి నెట్లు ?

౬౯

ఇవి యథాకంఠనిర్గతం బవి తథావి
లిఖితములు ప్రేమగీతముల్ దేవి ! నీయ
పాంగరేఖాచలన్మందహాసవాహి
నీతరంగాల నామగుండియ చలించి

ఈవిశాలకృష్ణాతటీవిపినవిలాస
మృదుశైబలశారదాంబుసంపదలఁ గదలు
లాడు జమిలినావలకు సామ్యము కుదుర్తు
నీప్రశాంతాస్మదుభయమూర్తి ప్రథలకు.

ఇది విచిత్రమ్ము నాకు నాకే మదీయ
హృదయమున నన్ను నేఁ బ్రతిష్ఠించుకొనుచు
స్నిగ్ధదేవతామూర్తిని నేన పూజ
చేసికొందు నన్ను వరలక్ష్మీదయితుని.

౭౦

ఈవసంతప్రయాణమ్ము నేగుచుంటి
నా! ప్రతిమలుపునందు నీవై యిదె కను
మింత దూరమ్ము వచ్చినా వీ వటంచు
జ్ఞాపకము నాకు చేయుచున్నావు దేవి!

ప్రతిమలుపునందునుం జానపదుల బాల
వలె నసంస్కృతములు రాగివైన కేశ
ములును నిర్వ్యాజశోభ దృక్కులును ధూళి
పిహితదేహమ్ముతోడఁ గన్పించుచుంటి.

కనులఁ బొడిచితి వీయనాగరకజాన
పదకుమారికామూర్తివి ప్రథమమందు
నేను నిర్వ్యాజశోభి నూహించుకొలఁది
నాకనుగొలంకు నిండుచున్నది జలాన.

౭౧

ఇవి ప్రతిఁ పూరితైన ప్రవాహింపఁజేతు
నీయమునగునదమ్ములందు ననేకనాక
వాహినులు వానినీఁగవుల్ ప్రాశనమ్ము
గాఁగ భావ్యాంధ్రదేశసత్కవుల కెల్ల.

మధురహైమనచ్ఛాభిరామయుచు మదవ
తీరణన్నూపురక్రేంకృతిప్రశస్త
కూజితయునైన హంసిపైఁ గూరుచుండి
భావిశారదామూర్తిని ప్రజ్వలింతు.

ఆసరస్వతి నిన్ను జిహ్వాగ్రసీమఁ
దాండవింపించినట్టి విధాతృమూర్తి
నన్ను నాసృష్టి నేమి యనంగఁగలరొ
మనశిశువులైన భావిసంపన్నకవులు.

అమృతకేశీరహోనాథుఁడైన యపుడు
నీ చెవుల నూదుచుండు ననేక ప్రేమ
గీతములు నీవు విని యరమూఁతకనులఁ
బ్రతిప్రణయగీతమున కనుమతి యొసఁగెదు.

నేను వినుపించుచునెయుండు నీకనులవి
మొగ్గలనుబోలె నిదురలో మూఁతపడును
ఆప్రణయగీతి యానాఁటి కనుమతింపఁ
బడక మరునాఁటికై యాపఁబడును దేవి!

శరదమలమేఘమగు నాకసంపు సరసి
శాంతమై తేలియాడెడు చందమామఁ
బోలె నేకదృక్కులను నీమోము కనుచుఁ
గనుచు నేను నిదురపోదుఁగావలయును.

౭౩

'ఛాపిపావ' లేఖయొకండు వ్రాసినాఁడు
నేను ముక్తచ్ఛందోమధ్యాన వెలయు
హారిపిసిలనాయకమణినంట సితస
రఃప్రదేశలో లేందీవరంబునంట.

అతఁడు మధువాక్కు వగు, పరిహాసకాఁడు
కించిదరుణకపోలము కెలని పుట్టు
మచ్చ నఁట శకస్త్రీకుచమండలమునఁ
గరగుటకు సిగ్గునపు చూచుకంబు నంట.

హారిమణీందీవరమ్ములు నచ్చమైన
పుట్టుమచ్చయుఁ జూచుకమ్మునివి నేనె
ఆశబలవర్ణ వర్ణితమ్మైన దేదో!

౭౮

ఊహాపై నూహ లల్లి నే నొక్కరుండ
నున్నయప్పుడు బంగారుచిన్నిమేడ
బురుజు లొక్కటియా! సర్వమును మహాంధ
కారమున భావవీధిలోఁ గట్టుచుంటి.

ఆవిలాసైకరమ్యసౌధాగ్రసీమఁ
బైడిగొలుసుల యుయ్యాల పట్టిమంచ
మందున సుఖైకతల్పుఁడనై మహాంధ
కారమున సుఖస్వప్నముల్ గాంచుచుంటి.

బహుళజన్మాత్తసంస్కారభద్రమైన
ఒకవెలుఁగు నాదుగుండెలో నొదిగియుండె
ఆవెలుఁగు సోకి నామేడయంత కరగి
పడతి! నే నింతలో దిశాంబరుఁడ నైతి.

౭౫

ఒక్క యప్పుడీ నీమేను మహోన్నతంపు
పర్వతముపోలె నిక్కిలిభార మగుచు
మఱియొకప్పుడు ననకుసుమాంకుసుము
సదృశమై గాలిపొరలలో జారిపోవు.

అది మహాపర్వతముపోలె నమితభార
మైన వేళల నాకు భయంబు లేదు
గాలిలోఁ బూవురేకునుబోలె నెగురు
వేళ నాయాత్మ యిది భయావిష్ట మగును.

ఉండి యుండి యేవేళనో ఒక్కమరణ
మనుచు లేక యెదో రుజ యనుచు లేక
కప్పురముపోలె నీమేను కరగిపోయి
చనునో యేనిద్రయో మేలుకొనఁగఁబడక.

౭౬

పలుకరాని జ్యోతిస్సు నాప్రణయమెల్లఁ
గావ్యరూపమ్ముగా నిట్లు కరుగఁబోసి
ప్రళయకాలనిగూఢగర్భమ్మునందు
దీనియాకృతిఁగూర్చి చింతించుచుంటి.

ఈమహాద్వైతభావ మిదింత కుదిరి
కుదురనీయద యేలొ నాహృదయశాంతి
ఈసుకావ్యాకృతిం గుదియించివైచి
దివ్యమగు జ్యోతిగా సమర్ధింప నెంతు.

విగతతృష్ణుని న న్నింత వెక్కిరించు
నీమహాతృష్ణ

౨౨

ప్రకృతిసిద్ధమ్ముగా నాకు వర్షఋతువు
వానుసంధ్యలు నివి మనోఽబ్జమున కెక్కు
నామనస్సు సమ్మార్జనమ్ము నెడలి
హృదయకుహరమ్ములో శాంతి వెదకికొనును.

ఉదయసంధ్యలకన్న నాకూహా సేయఁ
గాఁ జరమసంధ్యలే భావగర్భితములు
గాఁ గనంబడు నీమొగిల్ కడల మెరసి
కనకగిరిసానువులఁబోలెఁ గానిపించు.

౭౮

శ్రీమధురమూర్తులును చిరంజీవులైన
యట్టి వత్సలాసౌభను ప్రియమృతప్రణయ
వారిరాశిసి పుడిసిటఁ బట్టినాకు
ఎఱిఁగిన జనమ్ము నిర్వ్యాజయే భజింప.

నిభృత మస్మద్ధృదబ్జమ్ము నిండియున్న
ప్రణయతేజ మాపుణ్యదంపతులయెడల
సాభిలాషమై వాక్ప్రవాహములు కట్టె
నమృతమయములు స్నిగ్ధభావాలసములు.

అతిపవిత్రమ్మయగు ప్రణయమ్మునెడల
నింత సుస్నిగ్ధుఁడైన నన్నివు నూత్న
మధురమధురకటాక్షసంపదలఁ జూచి
నన్ను దివ్యునిఁ జేయుచున్నావు నరుని.

౭౭

మమనుష్యునుంజూవర్ణ సంఘనము కల్గి
సత్కృతిని గూఢసూచ్యభావమ్ము కలిగి
పరఁగ కల్యాణిపైఁ బాడఁబడిన తెలుఁగు
పాట యొక్కటి నీమనూపముగ మారె.

ఈసుకవినైన నాజన్మమెల్ల దేవి !
అచ్చపుఁదెలుఁగుపడఁతి వైనట్టి నిన్ను
మఱల నాతేనెపాటగాఁ గరఁగఁబోయఁ
ద్వాత్మదార్పితమ్ముగ నేను ధారవోతు.

౮౦

నాకు నక్షత్రముల దర్శనంబువలన
నీపవిత్రనిశావేళ నిరిసిపోయె
హృదయపద్మంబు పాపభూయిష్ఠమును తు
ఘాభిభూతమ్ము నాబ్రికు కరయుకొలఁది.

పొలఁతి మనపెండ్లి కట సాక్షిభూతుఁడైన
గార్హపత్యాగ్ని మఱల నాకరమువెంట
నక్షతలచేత హవ్యకవ్యములచేత
నర్చితుఁడు కానెలేద యే మనఁగవలయు.

మూఁడువహ్నులు నర్చితంబులుగఁ బొందఁ
దగినవఁటవె ! సావిత్రివర్త్మంబునందు
మెఱయు తారకాపదముల మేలిస్థితులు

౫౧

నీనజభ్రాకృతిశ్యామలచ్ఛవిః దనర్చి
కోసదేరి యాసుస్నిగ్ధకోమలంబు
నవజలదమూర్తి; చరమసంధ్యను శిరస్థ
తరుణశశిరేఖచేఁ బవిత్రం బొనర్చు.

చరమసంధ్యయుఁబలె ఫాలచంద్రరేఖ
నీలజలదకేశప్రసూనజాలమధుర
మూర్తి మత్కులపాలిక ముగ్ధహృదయ
ఈచరమసంధ్య నన్నె యూహించుచుండె.

౮౨

నీవు వేసఁగినదివోలె నీజమున్న
లాని కేగితి సాగరుఁబోని నేను
కల్పితోహాతరంగలఁ గదలి కదలి
మఱలమఱల నాలో నేనె తిరుగఁబడుదు.

సాధుజలసరిత్సాగరసంగమమ్ము
వోని మననాఁటికలయికలోని నాదు
నాక్రమణ నీదునోదుగుట యందమైన
యీనిశావేళ నేను నూహించుచుంటి.

ఈమధుప్రాణ్ణమాసామానిసీమనోజ్ఞ
వేళలో నీవు పరచిన తెల్ల సెజ్జ
పైనఁ బడుకొని నీరాపైత్రమ్మైన లోచ
నములతో నిన్నె మనసులోనఁ గనుచుంటి.

ఇంతలో నాపయినఁ బుష్పవృష్టి కురిసె
నవ్యమృదుమల్లికావాసనాతరంగ
గుమ్ముమని వచ్చి నాహృదయమ్ము దాఁక
దాచికొన్నది ఘ్రాణేంద్రియప్రవృత్తి.

కనులు తెరచితి నీముగ్ధకరమునుండి
నాపయినఁ బూలు రాలుచున్నవి విముగ్ధ
హృదయుఁడను రాలుచున్న పూ లేరి పొదివి
కొంటిఁ గవుఁగింట ముద్దిడుకొంటిఁ బెదవి.

౮౪

ఇదియు మార్గశీర్షపు శుక్లవిదియ హైమ
శైలతనయాహృదీశ్వరమౌళికృతమ
హాభిషేకశైత్యమ్ముల నపుడె విరియఁ
జల్ల మొదలిడె నీబాలచంద్రరేఖ.

తన్నికటదేశసంస్థితతారకావి
ముగ్ధమోహనరేఖలో ముడుతలు పడి
నాదృగంతమ్ము కుంచుకున్నది దిగంత
రములయందు నిదేమి శైత్యములు గ్రిక్కు.

ఈమహాశీతమునయందు నేమొ నాకు
గళవిలీనస్వరమున గద్గదిక వొడము
నస్మదీయదేహమున రోమాంచ మొదవుఁ
జలితలోచనముల బాష్పములు స్రవించు.

౮౫

మబ్బులఁ జూచు నవాషాఢ మరుగుచెంచెఁ
దరుణచిక్కణశ్యామలాభ్రములతోడ
మఱల మేఘుని మొడలు కొంచప్రవాహ
ఘనపరిష్వంగములయందుఁ గాంతి పొందు.

అస్మదీయవినీలదేహమ్ముగూడ
ముక్కలాంగనా బాహుహైమచ్ఛవిసుప
రిస్ఫురితమయి రమ్యమోహనాకృతి వహించు
నన్ను నఖ సిగ్గు పుచ్చుచున్నదియుఁ గూడ.

నాకు శంపాలతాంగి సౌందర్యరాశి
నన్నుఁ జూచి యీశంప సౌందర్యమూర్తి
వనుచు నగి పరిష్వంగించు.

౮౬

ఓయి ఆషాఢజలదుఁడ! ఓయి!! నీకు
నాకు సామ్యమ్ము కలదు విన్నావఁటయ్య!
నావలెనె నీవును గులాంగననుగుఱించి
ప్రణయసుకుమారగీతముల్ పాడుచుందు.

నీమధురగీతములు విని నేలయందుఁ
బులకలనుబోలెఁ బచ్చనిమొలక లెత్తు
నామధురగీతములను విన్నట్టివారి
ముగ్ధహృదయాలు క్రొంగ్రొత్తమోసు లెత్తు.

నీయుఁగును విప్రలబ్ధలౌ నెలఁతుకలను
గళవళింపించు నట్లె నాక్రమగీతి
కలును నసధర్ములకు బాధ కలుగఁజేయు
ఓయి! నీవలె నీలదేహుఁడను నేను.

౮౭

నీవు నామనస్సున నిల్చినావు దేవి!
నామనసు గోత్తులుచు శారదామనోజ్ఞ
చాణముంజీరికసితరంజితక్షణాంక
పలితములు నాప్రణయగీతి పాపు తిరిగి.

నీవు నాగుండెఁ గదలించినావు దేవి!
దేవి! తత్రత్యులగు సర్వదేవతలును
అనభిహూతములు హావ్యకవ్యములు పొంది
నాయకర్మిష్ఠత క్షమించినారు దేవి!

నీవు నామేనఁ బెనవడినావు దేవి!
నాతనూలతపైన మాన్మథవిలాస
చిహ్నములు తోఁచి నాదీర్ఘజీవితమ్ము
మనపరస్పరప్రణయాంకమును వహించు.

తతపురాకృతకర్మానుగతి మదీయ
భాగ్యము వినిర్ణయము చేయు బ్రహ్మముదల
ననుసరించిరి నాదుపిత్రాదు లగ్ని
సాక్షికంబుగ నిన్ను నాచానఁ జేసి.

అస్మదీయపురాకృతమైన పుణ్య
మింత యని యిట్టి దని నాకు నెఱుఁగబడని
వేళలో నీవు మత్కంఠవిదళనక్రి
యార్థకల్పితశిల వని యాడుకొంటి.

కర్మసిద్ధాంత మనుగతగతిఁ జరించి
నాసుకృత మూర్జిత మ్మన్న జ్ఞాన మొదవి
ఈమహానందక్లుప్తస్వర్ధాము మంజ
లిప్రణీతమందాకిని శ్లేషణింతు.

౯౬

మన్మనోజ్ఞతనూవినిర్మాణకలిత
భూతపంచీకరణవేళ మొగ్గపడి క
సమ్మ్రు కావలెఁ గాక యాషాఢగతున
కంబుమాన కేల నాహృదయంబు కరగు.

ఈజలగుఁ డింతకునుమున్నె యెన్నొ పాంపేఁ
గానుకలు మద్గిరాంవీధికలఁ జరించి
ఇతని కార్ద్రుఁడనైన నాహృదయపుటము
వీఁ డెఱఁగనేమొ మఱిమఱి వెంబడించు.

మున్ను నర్తనశాలాభిముఖుఁడనై మ
హాంధతామిస్రశర్వరియందుఁ గీచ
కుండనయి వీనిలోన లీనుండనైతి
మఱలఁ దనలోనఁ గలుపుకోఁ దరుమఁజొచ్చె.

ఈ ప్రణయగీతి మును పల్కరించినంత
నాయెడ మహానురక్తయునాఁ బరువులు
పెట్టి నన్నేడి దిప్పుడు పిలచి పిలచి
నాగళము సన్నవోవుచున్నదియుఁ గూడ.

మనము నూత్ననూత్నప్రణయాంబునిధులందు
ముగ్ధులము సచేలస్నానములు పొనర్చి
తెఱిని బహుధాభిలషితభేదప్రహాణ
మంకు నాగీతి పొంగెసి దబ్ధివోలె.

ఇప్పుడు ప్రశాంతసంసార మిద్దఱమును
నీవు నే నయి నేనును నీవు నై ప
రస్పరహృదంతరాళవిశ్రాంతి పొందు
వేళ నే మయ్యె నాగొంతు పిలచి పిలచి.

౯౧

నీవు తొలినాఁడు వామనోనిభృతస్థితి
జన్మజన్మాంతరపుపీతసంచిక్రియాప్ర
ణీత మానందశశికలము నీమనోజ
తేజసంస్పర్శకలిమి వెల్గించినావు.

అది క్రమక్రమవర్ధితమై దిశాంత
రములు రోదసీకుహర మాక్రమణ చేసి
సాఁగ నానాగపదత్రివిష్టపము వెరిగి
నైకతారాపథములదాఁక పోయి.

ఈయనంతవృద్ధికి విసుగెత్తి తుదకుఁ
గుంచుకొని కుంచుకొని వినిగూఢ మస్మ
దంతరాత్మప్రవిష్టమై యందె మఱలఁ
దొల్లిఁ టానందశశికలమై తొంగలించు.

౯౨

మార్గశీర్షాంతవేళ గుమ్మడులు పూచి
యీ యుషఃకన్యకకు నలంకృతులు సేయు
మొగమునను లాగికొన్న దీముద్దరాలు
మిహికపుఁ సన్నముత్యాల మేలిముసుఁగు.

నాపువ్వుందోఁటలో లతాంతములు వదలి
కోరడులయందుఁ బూచిన గుమ్మడులనె
విలుకడలు చేసికొని కౌఁగిళులు వదలవు
తేఁట్లజంపతు లింతగాఁ వెల్లవారి.

మంచుదమ్మిన నాపోవు మార్గపార్శ్వ
కమ్రలతికాసతులు నన్నుఁ గౌఁగిలించి
నామొడలు జల్లు మనిపించినవి విలోచ
నార్ధమీలనసౌఖ్యమ్ము లావహించి.

— 3

సగము మేఘావృతమ్మయి సగము హరిణ
లాంఛనమనోజ్ఞశిశిరవిలాసచంద్రి
కావృతమ్మయి యీవ్యోమ మతివ! మనము
కౌఁగిటం గ్రమ్ముకొని యున్నకరణిఁ బోలుచు.

ఈజలదమాల వ్యాపించి యీశశాంక
కలితగగనార్ధభాగమ్ము గ్రమ్మె నేను
ప్రేయసీ! నిన్నను మదురఃపిహితవదన
నాక్రమించుకొన్నట్లుగా నవఘళించు.

దివ్యగంగాధునీపరదీప్త మంబు
ధరసమాక్రాంతము శశాంకతరుణచంద్రి
కావృత మిమ్మవియత్పథ మస్మదీయ
ప్రణయచారిత్ర మఖిలమ్ము ప్రతిఫలించు.

ఒకమహాగాథమును శిశిరోజ్జ్వలంబు
నగు నెదో పరిష్వంగమునందు మనల
ప్రాణపంచకయుగళమ్ము వాంఛ సేతు
దేవి! దశధాప్రతున్నంబు కావలె నని.

అప్పు డానిత్యవస్త్వభిన్నాత్మలమయి
వెలఁది! యీనాఁటి మనప్రేమబలముచేత
మనభవిష్యత్ప్రజాసుకుమారహృదయ
ప్రణయచరితముల్ పాలించవలయు ననియు.

౭౨

నీపరిశాంతాచ్ఛని స్తరంగప్రణయప
యస్సుధారాశిలోపల నస్మదీయ
ముజ్జ్వలప్రేమనౌకయు నున్నచోట
నున్నయట్లుగఁ గదలకయుండె దేవి!

అనియు నిర్వీచి నిర్వాయు నస్మదీయ
నౌక యీరేయొడ్డు పట్టుకొన్నది సమీర
మొక్కపొర లేదు తెరచాప లూఁది యూఁది
చిన్నిగాలిపొరల్ కదల్చితిని నేను.

బహుప్రయాసమ్ముపడి పరవళ్ళు ద్రొక్కి
ని స్తరంగభవత్ప్రేమనీరరాశిఁ
జిన్నరితరంగచ్చాలు సృజించినాను
చిన్ని నానౌక యేరెయొడ్డు చేరుటకును.

౯౬

లలితశృంగారమధుమాసలక్ష్మివైన
నీవిలాసైకపాదచిహ్నితసుమమ్ము
నామెడఁద పూవుదోఁట యనంతకోటి
గౌసుమపరీమళముల శ్లాఘ్యత వహించు.

ఆపువుందోఁటను బికమ్మనైన నాసు
మధురపంచమగీతిలో మఱగియుంటి
మీపువుందోఁటతోఁగూడ నీవు నేను
సకలమైనట్టి యీప్రపంచకముతోడ.

అంను నిని యున్న దనుచు లే దనుచు లేక
యున్న దని యుండిలే దని యిన్ని గతుల
రమ్యమద్గీత మిది పరబ్రహ్మవోలె
నీయతికృపచేత విచారణీయ మయ్యె.

౯౭

నీపయిన నేను పాట లెన్నియో రచించి
యీమృదులవీణమీఁద వాయించుకొనుచు
వాడవాడలఁ దిరుగుచున్నాఁడ నన్ను
నేరునుం బల్కరించినవారు లేరు.

అలసి యీవీణ తలక్రింద నవధరించి
నిదురపోదున ఎండ మండిపడునేని
వీణ యిది నెత్తి కడ్డము పెట్టుకొందు
నాలయు వానలు దీనితో నొడ్డుకొందు.

నీపయిన నిన్నిగీతముల్ నిర్ణయించి
పలుకు నీవీణ యొండకు వాన కిల్లు
చివికిపోయి యేనాఁటికో శిథిలమైన
నది పలికినట్టి పాట లేమౌనో కాని.

మనపరస్పరప్రేమసంబంధ మింత
దృఢతరం బౌటకును గత మేమొ యంచుఁ
గారణము లొక్కటొక్కటిగా నేరి తెచ్చి
తొలుత తొలుతనె కాదని త్రోసిపుత్తు.

పాప మిల్లు నిరాకరింపఁబడికూడ
నాయెడల నిత్యమును బ్రసన్నము లెసుమ్మ
నీదుసౌందర్యశీలముల్ నిసులీన
తయును నీయిట్టిదగు నగాధంపుఁబ్రేమ.

ఇన్నినాళ్ళకుఁ దెలిసిన దీప్రణయపు
సుదృఢబంధకారణము నాయెద విధేయ
మై పసితనంపునాఁటి పిత్రాజ్ఞ నెంచి
జననియనుమతి గని భక్తివినత మయ్యె.

౭౭

అమృతతరుపల్లవాభిరామార్ద్రమూర్తి!
నీకృపావేశమునఁ జేసి నీపదాంబు
జముల మ్రోగిన నాగానజనితరవము
వినఁబడియెఁ బ్రేమవాహినీవీథులందు.

అమితశృంగారరసవీథులందు నీకు
నవవసంతోత్సవంబులే చివురుఁబోఁడి!
ప్రణయసోపానముల నిలంబడి మదీయ
భావకన్యక నీకు నివ్వాళి పట్టు.

ఈనవమధూదయపు వేళ నింతి! నిన్నుఁ
బ్రణయకోమలమాకందపాదపమ్ము
శీతలచ్ఛాయలందు వసింపఁ జేసి
ముగ్ధభావప్రసూనాలు పూజ లిత్తు.

౧౦౦

మొగిలుచాటు శరజ్జ్యోత్స్న మొగిఁ బిశంగ
రుచులు వెదజల్లుపక్షముల విచికిలార్ద్ర
గంధి! వలిపంపు పండుచెంగావిచీర
పై విలోచనాంతాంజనప్రభలు పర్వ.

వచ్చి నీమే నొకేసారి వార్షుకాభ్ర
లీనసౌదామనీపింగలిమము నంగు
లీవిలూనజపాపాటలిమను చలధ
లీగరున్మోహనశ్యామలిమము తన్వీ!

నవనవసరస్వతీయము నాభగీర
థాత్మజా వేణికాపూతయగు ప్రయాగ
వోలె సత్వరజస్తమోభూరిగుణస
నాథశాంకరివోలె నందగిలె దీవు.

౧౦౧

పడంతి! నీప్రేమదాసుల నడచి నడచి
పూవుల బజారులందునఁ బోయినట్లు
నవనవపరిమళ త్రసూనవ్యతాము
నోజ్ఞమూర్తిగ నెంచుకొందును లతాంగి

తరుణి! మన్మనఇంద్రియద్వారమున భ
వత్ప్రవేశవాంఛాలవేశప్రచలిత
మైన నాయాత్మఁ జొచ్చు నీయమృతవాస
నానిలమ్ములు పోసికొన్నవి పురంధ్రి!

నాసొగసుటింటఁ జిన్నిరత్నంపుదీప
మిడికొనివరీతిఁ బదునుచేయించుకొన్న
నాదుపొలమున సురగంగ బోదె కొదుగు
లీల నాయాత్మ నీవు వెల్గించినావు.

౧౦౨

తుంగగిరిసానువుల మహోద్రితతరంగ
మాగిరికుమారకుని ప్రేమవేగ మదియు
ఆసక్తుల కౌగ్గి నీయందుఁ జేరిమ
నింత చిఱుచాకలై ప్రవహించె చూడు.

నిలుకడలుపడ్డ యాప్రేమకొలఁకులకును
కెలఁకులను బూచె శతపత్ర మలఘుతరము
ముగ్ధరమ్యమ్ము కానుక పుచ్చుకొమ్ము
కోసి తెచ్చితి దీని నీకొఱకు నేఁడు.

ఇది సభక్తిక మర్పిత మిది భవచ్ఛి
రంబునను నీదుమోముపై వ్రాలి దేవి!
శారదాఫాలబాలశశాంకరేఖ
వలెఁ జెలంగె నాపూర్వతపస్సుచేత.

౧౦౧

పడఁతి! నీప్రేమదాసుల నడచి నడచి
పూవుల బజారులందునఁ బోయినట్లు
నవనవపరీమళోత్తనూనవ్యతాము
నోజ్జ్వమూర్తిగ నెంచుకొందును లతాంగి

తరుణి! మన్మనఇంద్రియద్వారమున భ
వత్ప్రవేశవాంఛాలవేశత్ప్రచలిత
మైన నాయాత్మఁ జొచ్చు నీయమృతవాస
నానిలమ్ములు పోసికొన్నవి పురంధ్రి!

నాసొగసుటింటఁ జిన్నిరత్నంపుదీప
మిడికొనినరీతిఁ బదునుచేయించుకొన్న
నాదుపాలమున సురగంగ బోదె కొదుగు
లీల నాయాత్మ నీవు వెల్గించినావు.

౧౦౨

తుంగగిరిసానువుల మహోద్రితతరంగ
మీగిరికుమారకుని ప్రేమవేగ మదియు
ఆఁకట్టల కొగ్గి నీయందుఁ బేర్చు
నింత చిఱువాకలై ప్రవహించె చూడు.

నిలుకడలుపడ్డ యాప్రేమకొలఁకులకును
కెలఁకులను బూచె శతపత్ర మలఘుతరము
ముగ్ధరమ్యమ్ము కానుక పుచ్చుకొమ్ము
కోసి తెచ్చితి దీని నీకొఱకు నేఁడు.

ఇది సభక్తిక మర్పిత మిది భవచ్ఛి
రంబునను నీదుమోముపై వ్రాలి దేవి!
శారదాఫాలబాలశశాంకరేఖ
వలెఁ జెలంగ నాపూర్ణమనస్సుచేత,